# అథ షోడశో%ధ్యాయః

# యక్షేశ్వరావతారము

నందీశ్వర ఉవాచ|

యక్షేశ్వరావతారం చ శృణు శంభోర్మునీశ్వర | గర్విణాం గర్వహంతారం సతాం భక్తి వివర్ధనమ్|| 1

పురా దేవాశ్చ దైత్యాశ్చ పీయూషార్థం మహాబలాః | క్షీరోదధిం మమంథుస్తే సుకృతస్వార్థ సంధయః || 2

మథ్యమానే%మృతే పూర్వం క్షీరాబ్ధేస్సురదానవైః | అగ్నే స్సముత్థితం తస్మాద్విషం కాలానలప్రభమ్ || 3

తం దృష్ట్వా నిఖిలా దేవా దైత్యాశ్చ భయవిహ్వలాః | విద్రుత్య తరసా తాత శంభోస్తే శరణం యయుః || 4

దృష్ట్వా తం శంకరం సర్వే సర్వ దేవశిఖామణిమ్ | ప్రణమ్య తుష్టువుర్భక్త్యా సాచ్యుతా నతమస్తకాః || 5

తతః ప్రసన్నో భగవాన్ శంకరో భక్తవత్సలః | పపౌ విషం మహాఘోరం సురాసుర గణార్ధనమ్ || 6

పీతం తం విషమం కంఠే నిదధే విషముల్బణమ్ | రేజే తేనాతి స విభుర్నీల కంఠో బభూవ హ || 7

నందీశ్వరుడిట్లు పలికెను-

ఓ మునీశ్వరా! గర్విష్ఠుల గర్వమును అడంచునది, సత్పురుషుల భక్తిని వర్ధిల్ల జేయునది అగు శంభుని యక్షేశ్వరావతారమును గూడ వినుము (1). పూర్వము మహాబలశాలురగు దేవదానవులు తమ తమ స్వార్థమును సంపాదించుకొనవలెననే పట్టు దల గలవారై అమృతము కొరకు క్షీరసముద్రమును మథించిరి (2). పూర్వము ఇట్లు దేవదానవులు క్షీరసముద్రమును అమృతము కొరకు మథించుచుండగా ఆ అగ్నినుండి కాలాగ్నివలె దహించే విషము

పుట్టెను (3). వత్సా! దానిని చూచి సమస్త దేవదానవులు భయముతో కంగారుపడి తొందరపడి పరుగెత్తి శంభుని శరణు పొందిరి (4). విష్ణువుతో సహా వారందరు దేవతలందరిలో శ్రేష్ఠుడగు శంకరుని గాంచి సాష్టాంగ ప్రణామమాచరించి భక్తితో స్తుతించిరి (5). అపుడు భక్తవత్సలుడగు శంకరభగవానుడు ప్రసన్నుడై, దేవరాక్షసుల నందరినీ పీడించుచున్న మహాఘోరమగు విషమును త్రాగెను (6). విషమును త్రాగి ఆ భయంకర పదార్ధమును తన కంఠమునందు దాల్చియుండెను. ఆ విభుడు దానిచే నీలవర్ణముగల కంఠము గలవాడై మిక్కిలి ప్రకాశించెను (7).

తతస్సురాసురగణా మమంథుః పునరేవ తమ్ | విషదాహ వినిర్ముక్తాః శివానుగ్రహతో%ఖిలాః || 8

తతో బహూని రత్నాని నిస్సృతాని తతో మునే | అమృతం చ పదార్థం హి సురదానవయోర్మునే || 9

తం పపుః కేవలం దేవా నాసురాః కృపయా హరేః | తతో బభూవ సుమహాన్ రత్నం తేషాం మిథో%కదమ్ || 10

ద్వంద్వయుద్ధం బభూవాథ దేవదానవయోర్మునే | తత్ర రాజహుభయాచ్చంద్రో విదుద్రావ తదర్దితః || 11

జగామ సదనం శంభోశ్శరణం భయవిహ్వలః | సుప్రణమ్య చ తుష్టావ పాహి పాహీతి సంవదన్ || 12

తతస్సతామభయదశ్శంకరో భక్తవత్సలః | దధ్రే శిరసి చంద్రం స విభుశ్శరణమాగతమ్ || 13

అథాగతస్తదా రాహు స్తుష్టావ సుప్రణమ్య తమ్ | శంకరం సకలాధీశం వాగ్భిరిష్టాభిరాదరాత్ || 14

శివానుగ్రహముచే వారందరు విషబాధనుండి విముక్తిని పొందిరి. తరువాత మరల ఆ దేవదానవులు సముద్రమును మథింప జొచ్చిరి (8). ఓ మహర్షీ! తరువాత దానినుండి అనేకరత్నములు బయల్వెడలినవి. ఓ మునీ! దేనిని పొందుట కొరకై దేవదానవులు

శ్రమపడుచుండిరో, ఆ అమృతము కూడ పుట్టెను (9). విష్ణువు కృపచే ఆ అమృతమును దేవతలు మాత్రమే త్రాగిరి. రాక్షసులకు అమృతము దక్కలేదు. ఆ తరువాత మరియొక గొప్పరత్నము పుట్టెను. అది రెండు పక్షములవారికి దుఃఖమును కలిగించినది (10). ఓ మహర్షీ! అపుడు దేవదానవులకు ద్వంద్వయుద్ధము జరిగెను. అపుడు రాహువుచే పీడింపబడిన చంద్రుడు ఆతనికి భయపడి అచటనుండి పారిపోయెను (11). ఆతడు భయముచే పీడను పొంది శంభుని గృహమునకు వెళ్లి చక్కగా ప్రణమిల్లి రక్షింపుము అని పలికి శరణు జొచ్చి స్తుతించెను (12). అపుడు సత్పురుషులకు అభయమునిచ్చువాడు, భక్తవత్సలుడు అగు ఆ శంకరవిభుడు శరణు జొచ్చిన చంద్రుని శిరముపై దాల్చెను (13). అపుడు రాహువు అచటకు వచ్చి సకలాధీశ్వరుడగు శంకరుని నమస్కరించి అభీష్టములగు వచనములతో సాదరముగా ఆయనను స్తుతించెను (14).

**శంభుస్తన్మతమాజ్ఞాయ తచ్ఛిరాం స్య చ్యుతేన హ | పురా ఛిన్నాని వైకేతు సంజ్ఞాని నిదధే గలే || 15**

తతో యుద్ధే%సురాస్సర్వే దేవైశ్చైవ పరాజితాః | పీత్వామృతం సురాస్సర్వే జయం ప్రాపుర్మహాబలాః || 16

విష్ణు ప్రభృతయస్సర్వే బభూవుశ్చాతి గర్వితాః | బలాని చాంకురం తోంత శ్శివమాయా విమోహితాః || 17

తతస్స శంకరో దేవస్సర్వాధీశో%థ గర్వహా | యక్షో భూత్వా జగమాశు యత్ర దేవాస్థ్సితా మునే || 18

సర్వాన్ దృష్ట్వాచ్యుతముఖాన్ దేవాన్యక్షపతిస్సవై | మహాగర్వాఢ్య మనసా మహేశః ప్రాహ గర్వహా || 19

శంభుడు ఆతని అభిప్రాయమునెరింగి పూర్వము విష్ణువుచే నరుకబడిన కేతువు అను పేరుగల ఆతని శిరస్సును తన మెడలో ధరించెను (?15). తరువాత యుద్ధములో రాక్షసులందరు పరాజయమును పొందిరి. వారిపై విజయమును సాధించిన

మహాబలశాలురగు దేవతలందరు అమృతమును గ్రోలిరి. అది వారి విజయమునకు కారణమాయెను (16). అపుడు విష్ణువు మొదలగు దేవతలందరు శివమాయచే మోహితులై మిక్కిలి గర్వమును పొందియుండిరి. వారిలోపల శక్తి అంకురించుచుండెను (17). ఓ మునీ! అపుడు సకలాధీశుడు, గర్వమును పోగొట్టువాడు అగు శంకరుడు యక్షరూపమును దాల్చి దేవతలు ఉన్న స్థానమునకు వెళ్లెను (18). గర్వమును పోగొట్టే మహేశ్వరుడు యక్షేశ్వరుని రూపములోనున్న వాడై మిక్కిలి గర్వముతో నిండియున్న మనస్సుగల విష్ణువు మొదలగు దేవతలందరినీ గాంచి ఇట్లు పలికెను (19).

యక్షేశ్వర ఉవాచ |

కిమర్థం సంస్థితా యూయమత్ర సర్వే సురా మిథః | కిము కాష్ఠా
ఖిలం బ్రూత కారణం మే% ను పృచ్ఛతే || 20

యక్షేశ్వరుడిట్లు పలికెను-

దేవతలారా! మీరందరు కబుర్లాడుకొనుచూ ఇచట నిలబడి యుండుటకు విశేషమేమి? నేను కారణమునడుగుచున్నాను. వివరముగా చెప్పుడు (20).

దేవా ఊచుః |

అభూదత్ర మహాన్ దేవ రణః పరమదారుణః | అసురా
నాశితాస్సర్వే% వశిష్టా విద్రుతా గతాః || 21

వయం సర్వే మహావీరా దైత్యఘ్నా బలవత్తరాః | అగ్రే%స్మాకం
కియంతస్తే దైత్యాః క్షుద్రబలాస్సదా || 22

దేవతలిట్లు పలికిరి-

ఇచట మిక్కిలి భయమకరమగు దేవదానవ యుద్ధము జరిగినది. రాక్షసులందరు నశించిరి. మిగిలిన వారు పలాయితులైరి (21). మేము అందరము మహావీరులము, రాక్షసులను సంహరించిన

బలశాలురము. మా ముందు సర్వదా అల్పబలులైన ఆ రాక్షసులు ఎంత? (22)

నందీశ్వర ఉవాచ|

ఇతి శ్రుత్వా వచస్తేషాం సురాణాం గర్వగర్భితమ్ | గర్వహాసౌ మహాదేవో యక్షరూపో వచో% బ్రవీత్ || 23

నందీశ్వరుడు ఇట్లు పలికెను-

గర్వముతో నిండియున్న ఆ దేవతల ఈ పలుకులను విని, యక్షరూపములో నున్నవాడు, గర్వమునడంచువాడు అగు ఆ మహాదేవుడు ఇట్లు పలికెను(23)

యక్షేశ్వర ఉవాచ|

హే సురా నిఖిలా యూయం మద్వచ శ్శృణుతాదరాత్ | యథార్థం వచ్మి నాసత్యం సర్వగర్వాపహారకమ్ || 24

గర్వమేనం న కురుత కర్తా హర్తా%పరః ప్రభుః | విస్మృతాశ్చ మహేశానం కథయద్వం వృథాబలాః || 25

యుష్మాకం చేత్స హి మదో జానతాం స్వబలం మహత్ | మత్ స్థాపితం తృణమిదం ఛింత స్వాస్సై#్రశ్చ త్రైస్సురాః || 26

యక్షేశ్వరుడిట్లు పలికెను-

ఓదేవతలారా! మీరందరు నామాటను ఆదరముతో వినుడు. అందరి గర్వమును పోగొట్టే సత్యవచనమును నేను పలికెదను. అసత్యమును చెప్పను (24). మీరిట్లు గర్వమును పొందకుడు. సర్వమును సృష్టించి లయమును చేయు పరమప్రభుడు గలడు. మహేశ్వరుని మరచిపోయినారా? చెప్పుడు మీ బలము వ్యర్థము (25). మీకు గర్వమున్నచో, మీ బలము ఎంత గొప్పదియో తెలుసుకొనుడు. నేనిచట గడ్డి పోచను ఉంచుతున్నాను. ఓ దేవతలారా! మీ మీ అస్త్రములతో దీనిని త్రెంపుడు (26).

నందీశ్వర ఉవాచ|

ఇత్యుక్త్వైకం తృణం తేషాం నిచిక్షేప పురస్తతః | జహ్రే సర్వమదం యక్షరూపస్సతాం గతిః || 27

అథ సర్వే సురా విష్ణుప్రముఖా వీరమానినః | కృత్వా స్వపౌరుషం తత్ర స్వాయుధాని విచిక్షిపుః || 28

తత్రాసన్ విఫలాన్యాశు తాన్యస్త్రాణి దివౌకసామ్ | శివప్రభావతస్తేషాం మూఢ గర్వాపహారిణః || 29

అథాసీత్తు నభోవాణీ దేవవిస్మయహారిణీ | యక్షో%యం శంకరో దేవా స్సర్వగర్వాపహారకః || 30

కర్తా హర్తా తథా భర్తా%యమేవ పరమేశ్వరః | ఏతద్బలేన బలినో జీవాస్సర్వే%న్యథా న హి || 31

అస్య మాయా ప్రభావాద్వై మోహితాస్స్వ ప్రభుం శివమ్ | మదతో బుబుధుర్నైవాద్యాపి బోధతనుం ప్రభుమ్ || 32

ఇతి శ్రుత్వా నభోవాణీం బుబుధుస్తే గతస్మయాః | యక్షేశ్వరం ప్రణ ముశ్చ తుష్టువుశ్చ తమీశ్వరమ్ || 33

నందీశ్వరుడిట్లు పలికెను-

సత్పురుషులకు శరణము అగు శివుడు యక్షుని రూపములో నున్నవాడై ఇట్లు పలికి ఒక గడ్డి పోచను వారి ముందు ఉంచి వారందరి మదమును అడంచెను (27). అపుడు విష్ణువు మొదలగు దేవతలందరు తాము వీరులమనే అభిమానము గలవారై తమ పరాక్రమమును ప్రదర్శించి దానిపై తమ ఆయుధములను ప్రయోగించిరి (28). మూర్ఖుల గర్వమునడంచు శివుని ప్రభావము వలన ఆ దేవతల అస్త్రములు దానియందు శీఘ్రమే వ్యర్థమైనవి (29). అపుడు దేవతల గర్వమును తొలగించుచూ ఆకాశవాణి ఇట్లు పలికెను. ఓ దేవతలారా! ఈయన అందరి గర్వమును పోగొట్టే శంకరుడు (30). ఈయనయే సృష్టిని నిర్మించి, పాలించి పోషించి, లయమును చేయు పరమేశ్వరుడు. శంకరుడు యక్షరూపమును

దాల్చియున్నాడు. ఈయనయొక్క బలముచేతనే సర్వప్రాణులు బలమును కలిగియున్నవి. లేనిచో జీవులలో బలము లేకుండును (31). ఈ శివుని మాయచే మోహితులైన మీరందరు గర్వించి మీకు ప్రభువు జ్ఞానస్వరూపుడు అగు శివుని ఇప్పటికైననూ తెలియజాలకున్నారు (32). ఈ ఆకాశవాణిని విని వారు తెలివి దెచ్చుకొని గర్వమును వీడి యక్షేశ్వరుని రూపమునందున్న ఆ శివునకు నమస్కరించి స్తుతించిరి (33).

దేవా ఊచుః |

దేవదేవ మహాదేవ సర్వగర్వాపహారక | యక్షేశ్వర మహాలీల మాయా తేత్యద్భుతా ప్రభో || 34

మోహితా మాయయాద్యాపి తవ యక్షస్వరూపిణః | సగర్వమభిభాషంతస్త్వత్పురో హి పృథఙ్మయాః || 35

ఇదానీం జ్ఞాన మాయాతం తవైవ కృపయా ప్రభో | కర్తా హర్తా చ భర్తా చ త్వమేవాన్యో న శంకర || 36

త్వమేవ సర్వశక్తీనాం సర్వేషాం హి ప్రవర్తకః | నివర్తకశ్చ సర్వేశః పరమాత్మా వ్యయో%ద్వయః || 37

యక్షేశ్వరస్వరూపేణ సర్వేషాం నో మదో హృతః | కృతోమన్యామహే తత్తే%నుగ్రహో హి కృపాలునా || 38

అథో స యక్షనాథో%ను గృహ్యైవ సకలాన్ సురాన్ | విబోధ్య వివిధైర్వాక్యైస్తత్రై వాంతరధీయత || 39

ఇత్థం స వర్ణితశ్శంభోరవతారః సుఖావహః | యక్షేశ్వరాఖ్యస్సుఖద స్సతాం తుష్టో%భయంకరః || 40

ఇద మాఖ్యాన మమలం సర్వగర్వాపహారకమ్ | సతాం సుశాంతిదం నిత్యం భుక్తి ముక్తిప్రదం నృణామ్ || 41

య ఇదం శృణుయాద్భక్త్యా శ్రావయేద్వా సుధీః పుమాన్ | సర్వకామానవాప్నోతి తతశ్చ లభ##తే గతిమ్ || 42

ఇతి శ్రీ శివమహాపురాణే రుద్రసంహితాయాం యక్షేశ్వరావతార వర్ణనం నామ షోడశో%ధ్యాయః (16).

దేవతలిట్లు పలికెను -

ఓ దేవదేవా! మహాదేవా! అందరి గర్వమును పోగొట్టువాడా! యక్షేశ్వరా! నీ లీలలు గొప్పవి, ప్రభూ! నీ మాయ అత్యద్భుతము (34).యక్షస్వరూపుడవగు నీ మాయ మమ్ములను ఈ నాడు కూడ మోహింపజేయుటచే నీ ఎదుట మేము నీనుండి విడివడి (భేదబుద్ధితో) సగర్వముగా మాటలాడి యుంటిమి (35). ఓ ప్రభూ! నీ అనుగ్రహము చేతనే మాకు ఇపుడు జ్ఞానోదయమైనది. ఓ శంకరా! జగత్తుయొక్క సృష్టిస్థితిలయకర్త నీవు తక్క మరియొకరు కాదు (36). సర్వశక్తులను ప్రవర్తింప జేయువాడవు, మరియు నివర్తింప జేయువాడవు నీవే. నీవే సర్వేశ్వరుడవు, పరమాత్మవు, వినాశరహితుడవు, అద్వితీయుడవు (37). నీవు యక్షేశ్వర రూపమును దాల్చి మా అందరి గర్వమును పోగొట్టితివి. అట్లు చేసి దయానిధివగు నీవు మాయందు అనుగ్రహముచే చూపించితివని మేము భావించుచున్నాము (38). అపుడా యక్షేశ్వరుడు దేవతలందరినీ అనుగ్రహించి, అనేక వచనములను వారికి బోధించి అచటనే అంతర్ధానమయ్యేను (39). ఈ విధముగా, సుఖమును కలిగించునది,సత్పురుషులకు ఆనందమును అభయమును ఇచ్చునది అగు శంభుని యక్షేశ్వరావతారము వర్ణింపబడినది (40). పవిత్రమగు ఈ గాథ అందరి గర్వమును పోగొట్టి, సత్పురుషులకు మంచి శాంతిని, మానవులకు సర్వదా భుక్తిని, ముక్తిని ఒసంగును (41). బుద్ధిమంతుడగు ఏ పురుషుడు ఈ గాథను భక్తితో వినునో, లేదా వినిపించునో, అట్టివాడు కోర్కెలనన్నిటినీ పొంది, దేహత్యాగము తరువాత పుణ్యగతిని పొందును (42).

శ్రీ శివ మహాపురాణములోని శతరుద్ర సంహితయందు యక్షేశ్వరావతార వర్ణనమనే పదునారవ అధ్యాయము ముగిసినది (16).